

# బాలగేయాలు

డా॥ ఎన్.గంగప్ప

# బా ల గే యా లు

ర చ యి త :

డా॥ ఎస్. గంగప్ప, ఎం.ఎ., పిహెచ్.డి.

ఆంధ్రోపన్యాసకులు, నాగార్జున విశ్వవిద్యాలయం,

నాగార్జున నగర్ 522 510, గుంటూరు జిల్లా





ప్రథమ ముద్రణ : ఆగస్టు 1981

ప్రతులు : 1000



**వెల : రూ. 5/—**

ముఖ పత్రం : అనామిక (సం॥ శ్రీమతి బి. విజయలక్ష్మిరాజ్) సౌజన్యంతో

అక్షర చిత్రణ : శ్రీ నాగుల్, మంగళగిరి.

ప్రతులకు :

శ శీ ప్ర చు ర ణ లు,

C-73 శ్రీనివాస నగర్, గుంటూరు-522 006.

నవోదయ పబ్లిషర్స్,

ఏలూరు రోడ్, విజయవాడ-2,

అరండల్‌పేట, గుంటూరు-2.

ముద్రణ : వైష్ణవి ప్రింటర్స్, గుంటూరు-1.

---

Paper was made available by the Govt. of India at Concessional rates

# వి ష యా ను క్ర మ ణి క




1. అందమైన బాలలం
2. ఆకాశవాణి
3. జీవితానికో లక్ష్యం
4. ఇది దాచుకొనే తీరు
5. ఆనందం కూర్చాలి
6. మా చిట్టి మల్లెపువ్వు
7. బామ్మా బామ్మా కథచెబుదూ
8. అంతర్జాతీయులం మేము
9. దూరదర్శిని
10. తోకలేని పిట్ట
11. తెలుగుబాల
12. భారతీయబాల
13. అల్లరి పిల్లలం
14. మానవతా వాదులం
15. దాతలం
16. టెలిఫోను
17. టెలిగ్రామ్
18. చిన్నారి
19. విరిబాలను
20. కొవ్వొత్తి
21. మనస్సు లలితం
22. కిసానులం
23. జవానులం

24. కష్టజీవులం
25. విమానం
26. శ్రామికులం
27. జయమ్ము నీకు తెలుగుతల్లి
28. రైలు
29. విద్య విలసిల్లాలి
30. వందనం పాఠశాలామతల్లీ
31. గడియారం
32. విద్యుత్తు
33. ఫాన్
34. జనతా బస్సు
35. ఆహా అద్భుతం
36. కలసి ఆడుదాం
37. సమానమే
38. సేవాపరులం
39. వందనం కళాశాలామతల్లీ
40. సినిమా
41. జేజేలు మా పాఠశాలా
42. వందనమమ్మా పాఠశాలా
43. అంతరిక్ష యానం
44. పరులకోసమే
45. చిట్టి చీమ
46. తాతకు దగ్గులు
47. మనకోసమే
48. ఆరోగ్యమే మహాభాగ్యం

# ముందుమాట

ఆచార్య తూమాటి దోణప్ప, ఎం.ఏ., పిఎచ్.డి
తెలుగు శాఖాధ్యక్షులు, నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్—522 510

మన విద్యావిధానం మన అవసరాలకూ, మన పరిసరాలకూ అనుగుణంగా లేదని అందరూ అంటున్నదే; అందుచేత దీనిని ఊచ ముట్టుగా సంస్కరించాలని అందరూ అంగీకరిస్తున్నదే. అయితే, సరియైన విధానాలను రూపొందించటంలోగాని, సరియైన రీతిలో వాటిని ఆచరణలో అనువదించడంలోగాని మన నిర్ణేతలకూ, నిర్దేశకులకూ సమస్యలపట్ల సదవగాహనా, సమగ్ర దృక్పథమూ, శాస్త్రీయ సమన్వయమూ అంతగా ఉన్నట్లు కన్పించదు. ఇన్ని ఉన్నా చిత్తశుద్ధి కొరవడితే లక్ష్యసిద్ధి కలలోని మాట!

మన ఉన్నత విద్యారంగం ఒక ప్రయోగశాల. అంతా పాలకుల చిత్తం; పాలితుల భాగ్యం. మన విధానాలు, సాధనాలూ రాజ్యచక్రం పట్టిన వ్యక్తుల, లేక వారి యిచ్చకాల సలహాదారుల ఇచ్చవచ్చిన తీరులో ఏఏటా మారిపోతుంటాయి. అక్కడిదొక కొంత, యిక్కడిదొక కొంత, వెరసి మన విద్యావిధానం ఒక అతుకుల బొంతగా, గతుకుల పుంతగా సిద్ధమయింది.

పై చదువుల విషయమే ఇలా అనిశ్చితంగా అస్తవ్యస్తంగా ఉన్నప్పుడు పిన్నల చదువు సంధ్యల విషయం చెప్పనక్కరలేదు. ఒక ముద్దూముచ్చటాలేదు. ఒక సరదా సంబరమూలేదు. ఎంతసేపూ గుంట ఓనమాలు దిద్దించడమో, పలకా బలపమూ పట్టించడమో, డాడీ, మమ్మీ అన్న చిలకపలుకులు పలికించడమోచేసి మన కర్తవ్యం పూర్తి అయిందని చేతులు దులుపుకొంటున్నాం. మహా అయితే బాలలు భావి పౌరులన్న బడాయికితాబు లిస్తున్నాం. వారిని గాలికీ ధూళికీ వదిలేస్తున్నాం.

సాహిత్య పరంగానూ మనది పాత బాణీయే! ఎక్కడచూచినా పెద్దలగొడవలు, రగడలు తప్ప పిన్నల సంగతి పట్టించుకోరు. బాల సాహిత్యానికి ఇపుడిపుడే మంచి

గడియలు వస్తున్నవి సాహిత్య స్రష్టల చూపును ఆకర్షిస్తున్నది బాల సాహిత్య సృష్టి అంత సులువైన పనికాదు. బాలల అంతస్తుకు దిగి వచ్చి వారి మన సత్వానికి అనురూపంగా రచనలు చెయ్యడం ప్రత్యేక కృషివల్లనే సాధ్యమవుతుంది

విమర్శనాత్మక రచనలలోనేకాక, సృజనాత్మక సాహితీ సృష్టిలోను చేయివేసి సేవా సనిపించుకొన్న రచయిత డా॥ గంగప్ప బాలసాహిత్య సృష్టిలోనూ ఉదతా భక్తిగా పాలుపంచుకుంటున్నారు. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో గంగప్ప చేసిన కృషికి ఫలమీ "బాలగేయాలు" సంపుటి ఇందు 48 ఖండికలున్నాయి. పాడుకోవ డానికీ, ఆడుకోవడానికీ పనికి వచ్చే తీరులో వీటిని తీర్చారు; ఆటపాటలతో పిల్లలకు చదువు సంధ్యలు నేర్పవచ్చునని నిరూపించారు

పసి పిల్లలకు అనుక్షణమూ అనుమానాలే. అదేమనీ, ఇదేమనీ తమ తల్లి దండ్రులనూ, ఇరుగు పొరుగు పిన్న పెద్దలనూ అడుగుతుంటారు. ఈ ఆకాశం నీలంగా ఎందుకుందనీ, నిప్పు ఎందుకు కాలుతుందని, పిట్టల్లాగా మనుషులు ఎందుకు ఎగరలేరనీ, మొక్కలు పైకే ఎందుకు పెరుగుతాయనీ .. ఇలా సవాలక్ష ప్రశ్నలు వేస్తుంటారు.సాధారణంగా పెద్దలు వీటికి జవాబులు చెప్పరుసరికదా చీదరించుకుంటారు లేదా వినీ విననట్లు ఊరకుంటారు లేదాఅది అంతేలే అని పులిమిపుచ్చుతారు.

అదేదో తెలుసుకోవాలని పిల్లలు ఉబలాటపడే అనేకాంశాలను గంగప్ప గేయ రూపంలో పొందుపరిచారు. పిల్లలలో దేశభక్తినీ, కలుపుగోలు తనాన్నీ, క్రమ శిక్షణనూ పెంపొందించడానికి అనువైన గేయాలను సైతం సంతరించారు. ఈ కృషిని అందరూ హర్షిస్తారనీ, అభినందిస్తారనీ ఆసిస్తున్నాను—

(సం) తూమాటి దోణప్ప

# ప్రస్తావన

1979 అంతర్జాతీయ బాలల సంవత్సరం. 1979 జనవరి మొదటి తారీఖున మా పిల్లలు కొత్త సంవత్సరం వేడుక జరుపుకొంటూండగా అలవోకగా "అందమైన బాలలం" అనే గేయరచన చేశాను పిల్లలు పాడి ఆనందించారు అలాగే వంద గేయాలు రచన చేయదలచాను కానీ 48 గేయాలతో నా రచన ఆగిపోయింది అనుకోని నా కంటిజబ్బువల్ల. వీటిలో కొన్ని పత్రికల్లో ప్రకటించబడ్డాయి. ఇన్నాళ్ళకు పుస్తక రూపంలో ముచ్చటగా ముస్తాబై వస్తున్నందుకు సంతోషిస్తున్నాను.

ఈ గేయ రచనలో ప్రత్యేక ప్రయోజనాన్ని ఆశించాను ప్రకృతి, ప్రకృతి లోని వస్తువులు, ప్రాణులు, వైజ్ఞానిక రంగంలో మనం సాధించిన ప్రగతి, యంత్రాలు మొదలైన వాటి సంగతులు చెబుతూనే నీతిని, సందేశాన్ని చివరిచరణంలో వివరిస్తూవచ్చాను పిల్లలు మెలగవలసిన తీరుతెన్నుల్ని, అలవరచుకోవలసిన గురుభక్తినీ, దేశభక్తినీ, పెంచుకోవలసిన మంచినీ, మానవతనూ స్పష్టంచేశాను.

బాల రచనలుచేయడం అంత సులభమైన పనికాదు. తేటతెలుగులో చెప్పాలని ప్రయత్నించాను. కానీ అక్కడక్కడా సమాసాలు దొర్లడం తటస్థించింది. అలవోకగా వచ్చిన వాటిని అలాగే ఉంచాను.

కోరిన వెంటనే ముందుమాటలు అందించిన పూజ్యులు ఆచార్య తూమాటి దొణప్పగారికీ, ముద్రణకు కొంతవరకు ఆర్థిక సాహాయ్యం గావించిన ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖవారికీ, అడిగినదే తడవుగా ముఖపత్రం బ్లాకును దయతో ఇచ్చిన అనామిక పత్రికా సంపాదకురాలు శ్రీమతి బి విజయలక్ష్మిరాజ్ గారికీ, కొన్ని గేయాలను ప్రకటించిన పత్రికాధిపతులకూ-నా కృతజ్ఞతలు

ముఖపత్రం అక్షర చిత్రణచేసిన శ్రీ నాగుల్ (మంగళగిరి), బ్లాకు తయారీలో సహకరించిన శ్రీ అబ్దుల్‌రజా హుసేన్ (పరిశోధక విద్యార్థి), ప్రూఫులు దిద్దడంలో సహకరించిన పోసా కృష్ణమూర్తి (పరిశోధక విద్యార్థి), శుద్ధప్రతి సిద్ధంచేసిన చి॥ గుమ్మా సాంబశివరావు (పూర్వ విద్యార్థి), చక్కగా ముద్రించిన వైష్ణవీ ప్రింటర్స్ (గుంటూరు) అధిపతి శ్రీ భవిరిశెట్టి రాజేంద్రప్రసాద్ — వీరందరికీ నా అభినందనలు.

డా॥ ఎస్. గంగప్ప.

# అంకితం

అల్లరి చిల్లరికి నెలవులు

ఆనందంపు అర్ణవాలు

మమతా మధుకార మరందాలు

నిండిన అందచందాల పూలు

ప్రపంచంలోని సమస్త బాలలు

వారికంకితం బాలగేయాలు

— డా. ఎస్. గంగప్ప

# అందమైన బాలలం

అందమైన బాలలం-ఆ
నందమైన బాలలం ॥అందమైన॥

రంగురంగుల మెరిసే పువ్వులం
ఘంగుఘంగున మ్రోగే మువ్వలం ॥అందమైన॥

కిలకిల పలికే చిలకలం
గలగల కులికే వలపులం ॥అందమైన॥

ముద్దు ముద్దుగా మురిసే చిట్టిపౌరులం
పెద్దల కలలను పండించే భావిపౌరులం ॥అందమైన॥

భారత జాతిసీతి రక్షకులం
భారతాభివృద్ధి సంరక్షకులం ॥అందమైన॥

1-1-1979

# ఆకాశవాణి

అబ్బాయిలూ విన్నారా

అమ్మాయిలూ కన్నారా

వింతలు_వింతలు_మన

చెంతనె చెంతనె ||అబ్బాయిలూ||

మీట నొక్కితే చాలు

మాటలు కతలూ వినిపిస్తాయి ||అబ్బాయిలూ||

మీట నొక్కినంతనే

ఆటలు పాటలు హాయి నిస్తాయి ||అబ్బాయిలూ||

మీట నొక్కిన వెంటనే

నాటకం నటనలు ఆనందాన్నిస్తాయి ||అబ్బాయిలూ||

మీట నొక్కిన క్షణాన

ఎక్కడెక్కడి వార్తలో ఇట్టె వినిపిస్తాయి ||అబ్బాయిలూ||

దూరం కాలం ఒకటయ్యాయి

చూసుకో మన చెంతకు వచ్చాయి ||అబ్బాయిలూ||

2-1-1979

# జీవితాని కో లక్ష్యం

పిట్టలు పిట్టలు—ఆకాశంలో
పిట్టలు పిట్టలు ||పిట్టలు||

బారులు బారులుగ పోతున్నాయి
దారులు దారులు చూపుతున్నాయి ||పిట్టలు||

నీలినీలి మొయిళ్ళు నింగిని వెలిశాయి
పాలలాంటి పిట్టలు పసందుగా వెలిగాయి ||పిట్టలు||

స్వేచ్ఛగాను బతుకుతాయి
స్వతంత్రంగా ఉంటాయి ||పిట్టలు||

అయినా ఉన్నది జీవితాని కోలక్ష్యం
అదే వాటి జీవిత గమ్యానికి సాక్ష్యం ||పిట్టలు||

3-1-1979

# ఇది దాచుకొనే తీరు

చూశారా ఈ వింత
కన్నారా మనచెంత ||చూశారా||

అది చక్కటి బొమ్మ
అందమైన బొమ్మ ||చూశారా||

మరతిప్పిన తిరుగును మనవైపు
మరలతిప్పిన తిరుగు తనవైపు ||చూశారా||

పైసలు పావలాలు చల్లగాను మింగుతుంది
పెద్ద చిన్ననోట్లను మెల్లగాను మెసవుతుంది ||చూశారా||

పొట్టనిండినట్లు పోల్చి మరతిప్పిన
బెట్టుగా మనకిస్తుంది చప్పున ||చూశారా||

ఇది దాచుకొనే తీరు మంచిది పెక్కింటిలో
ఇలా పెరుగుతాయి అంకెలు మనఅక్కౌంటులో ||చూశారా||

4-1-1979

# ఆనందం కూర్చాలి

అమ్మ కొట్టింది
నాన్న తిట్టాడు ॥అమ్మ॥

అందమైన బొమ్మ లాంటి చిట్టి
హంసలాంటి తెల్లటి పావడాగట్టి
పాడు చేసుకొంది బురదమెట్టి
పావడాను పాప – గట్టిగా ॥అమ్మ॥

అచ్చెరువు గొలిపే గడుగ్గాయి చిట్టి
అట్టె పట్టబోగా తుర్రుమందిపిట్ట
చుట్టూ తిండికి తిరిగే చీమనుపట్ట
కుట్టగా నేలకేసి కసిగా కొట్టింది ॥అమ్మ॥

హాయిగాను మనము బతకాలి
అక్కాయి అన్నాయిలతో మెలగాలి
నేస్తాలతో గొడవ లేక తిరగాలి
అమ్మా నాన్నలకి ఆనందం కూర్చాలి ॥అమ్మ॥

**5-1-1979**

# మాచిట్టి మల్లెపువ్వు

మాచిట్టి మల్లెపువ్వు-మా మంచి
పరిమళాలు రువ్వు ॥మాచిట్టి॥

మోము చంద్రబింబం
అంటే తగని కోపం
తెలిసిందేమో బండారం ॥మాచిట్టి॥

చల్లటి వెన్నెల చిరునవ్వు
మళ్ళీ చందమామ గుర్తొచ్చి
కళ్ళు నవ్వుతుంది చిరునవ్వు ॥మాచిట్టి॥

చిట్టి కళ్లు మిణుకు మిణుకుమనే చుక్కలు
చంద్ర బింబంలో కెలా వస్తాయి చుక్కలు ?
చిట్టి చిందించింది చిరునవ్వులు పెక్కులు ॥మాచిట్టి॥

బుగ్గలు గులాబీ మొగ్గలు
పెదిమలు దొండపండులు
చొంగ తేనెల సోనలు ॥మాచిట్టి॥

మాచిట్టి రబ్బరు బొమ్మెగాని కళ ఉంది
మాచిట్టి రంగారు బొమ్మెగాని కాంతి ఉంది
మాచిట్టి కదిలే బొమ్మ గనుక జీవముంది ॥మాచిట్టి॥

6-1-1979

బా ల గే యా లు

# బామ్మా బామ్మా కధ చెబుదూ!

బామ్మా బామ్మా కధ చెబుదూ
బావను గూర్చిన కధ చెబుదూ ॥బామ్మా॥

సూటూ బూటూ వేస్తాడా
సుందరంగాను ఉంటాడా ॥బామ్మా॥

చక చక చక నడుస్తాడా
పక పక పక నవ్వుతాడా ॥బామ్మా॥

మంచిని పెంచే కవితలు రాస్తాడా
మనిషి మనుగడ కధలు చెబుతాడా ॥బామ్మా॥

మాయా మర్మం లేనివాడేనా
మమతా మమకారం ఉన్నవాడేనా ॥బామ్మా॥

అహంకారం లేనివాడేనా
సహకారం కలిగినవాడేనా ॥బామ్మా॥

7–1–1979

# అంతర్జాతీయులం మేము

చిట్టి పొట్టి పిల్లలం
చింతలేని పిల్లలం ॥చిట్టి॥

జాతిమతాలు లేవు మాకు
కులవర్ణాలు లేవు మాకు ॥చిట్టి॥

మానవత మా జాతి
మమతయే మా మతం

జాలి తలచటం మా కులం
కరుణ చూపడం మా వర్ణం ॥చిట్టి॥

మాకు కలవు సమతలు
మాకు లేవు సీమలు ॥చిట్టి॥

జాతీయులమే కాము — అంత
ర్జాతీయులం మేము ॥చిట్టి॥

8-1-1979

# దూరదర్శిని

సినిమానా ఇది కాదు
నాటక మసలే కాదు ॥సినిమానా॥

ఎక్కడికీ వెళ్ళే పనిలేదు
ఉన్నచోటనే చూడవచ్చు ॥సినిమానా॥

అరుదైన రంగుల బొమ్మలు దర్శనమిస్తాయి
ఆటలు పాటలు మాటలు మురిపిస్తాయి ॥సినిమానా॥

చెవి కింపైన పాటలు
మనసు కింపైన ఆటలు ॥సినిమానా॥

బోరు కొట్టదుగా కించిత్తూ
ఆనందం మనది యావత్తూ ॥సినిమానా॥

మన పైస లేమీ పోవు
పోతే నాన్నవే పోతాయి ॥సినిమానా॥

ఇదంతా మానవ మేధ - సాధించిన
శాస్త్ర విజ్ఞానపు గాధ ॥సినిమానా॥

9-1-1979

# తోకలేని పిట్ట

తోకలేని పిట్ట ఇది
తోంబై ఆమడ పోతుంది
జీవం లేని పిట్ట ఇది—న
జావుగా వస్తుంది ॥తోకలేని॥

వేచి ఉంటారు వలచినవారు
కాచి ఉంటారు కావలసినవారు
కొందరికి మోదం — మరి
కొందరికి ఖేదం ॥తోకలేని॥

కమ్మని కలయిక కొందరికి - విర
హమ్ము మిగులు మరికొందరికి
నమ్మలేని వింతలు కొందరికి - ఆశ
వమ్ము చేసే వెతలు మరికొందరికి ॥తోకలేని॥

సువార్తలు తెస్తుంది - ఏ
సువార్తలు తెస్తుంది - అల్లా
వార్తలు తెస్తుంది - ఎల్ల
వార్తలు తెస్తుంది ॥తోకలేని॥

10-1-1979

# తెలుగు బాల

తెలుగు బాలను నేను - తేట
తెలుగు బాలను నేను ॥తెలుగు॥

తెలుగు తేట

వెలుగు బాట

కలుగు తోట - ఆడే ॥తెలుగు॥


తెలుగు పాట
జిలుగు మాట

కలుగు నోట - పాడే ॥తెలుగు॥

తెలుగు నీటు
పలుగు పోటు
కలుగు చోటు - కులికే ॥తెలుగు॥

11-1-1979

# భారతీయ బాల

బాలను నేను_భారతీయ

బాలను నేను ॥బాలను॥

అమేయ జ్ఞానమాని సమధిష్ఠిత తపోవనాలు

అనంత ప్రపూత హోమాగ్ని ధూప మాలికలు

సర్వజాతి మత సంస్కృతి సమ్మేళనాలు ॥బాలను॥

గంగా కృష్ణా గోదావరీ నదులు

కొరతలేని సిరుల నొసగు పెన్నిధులు

వైపరీత్యము లేకున్న బీదతనము వదులు ॥బాలను॥

స్వార్థ రహిత త్యాగ భోగాలు ఒకనాడు _ ని

స్వార్థ పరత పరగవలయు నేడు

సార్థకత ప్రగతి కలుగు నేడు నేడు ॥బాలను॥

12_1_1979

# అల్లరి పిల్లలం

అల్లరి పిల్లలం—అందమైన
అల్లరి పిల్లలం ||అల్లరి||

ఆడా మగా తేడా లేక
బెల్ బాటమ్ మాకు సూటు ||అల్లరి||

తడిలేని పొడి గిరజాల జుత్తు
అంఘగించేది మాకు సీటు ||అల్లరి||

గంభీరానికి ఎత్తుమడమల జోళ్ళు
మాకాళ్ళకు చక్కని తోడుపాటు ||అల్లరి||

13-1-1979

# మానవతా వాదులం

మానవతా వాదులం
మంగళ ప్రదాతలం ॥మానవతా॥

మంచిని పెంచి ప్రోదిచేస్తాం
చెడ్డని గోతిలో పాతేస్తాం ॥మానవతా॥

అసలు సిసలైన మొక్కల్ని పెంచుతాం
నసిగాని కలుపు మొక్కల్ని తుంచుతాం ॥మానవతా॥

అభ్యున్నత పరుల్ని చిన్నవారైనా ఆదరిస్తాం
అణచివేతదారుల్ని ఎంతవారైనా ఎదిరిస్తాం ॥మానవతా॥

ఆనందం అర్ణవమైన లోకాలకు నిచ్చెనవేస్తాం
నిర్జీవ దురహంకారగృహాల తలుపులుమూస్తాం॥ మానవతా॥

**14-1-1979**

# దాతలం

దాతలం—శాంతి ప్రదాతలం

దాతలం ॥దాతలం॥

ఉన్నది ఏదైనా ఇచ్చేస్తాం-లే
కున్నది ఎవరినుంచైనా గ్రహిస్తాం
సమ సమాజ నిర్మాతలం
జాతికి నీతి ప్రదాతలం ॥దాతలం॥

ఉన్నవారు ఉలికిపడ పనిలేదు
లేనివారు లేవడీ పడ పని లేదు
ఉన్నవారి కలిమి లేనివారిది
లేని వారి లేమి కలుగు వారిది ॥దాతలం॥

ప్రతిఘటనకు వ్యతిరేకులం-ప్ర
గతికి మార్గోప దేశకులం
కష్టసుఖాలకు బంటులం
వెలుగు నీడలకి జంటలం ॥దాతలం॥

15-1-1979

# టెలిఫోను

రింగు చేస్తే చాలు
రింగు రింగున మోగుతుంది
హాలో హాలో అంటేచాలు
అవతలి గొంతు వినిపిస్తుంది ॥రింగు॥

ఇట్టే తెలుపవచ్చు విషయాలు
అట్టే చేయవచ్చు నిర్ణయాలు ॥రింగు॥

నిత్య వ్యవహారాలు నిముషాన
అత్యంతావసరాలు అచిరాన
సాగించవచ్చు సులభాన
సాధించ వచ్చును సుఖాన ॥రింగు॥

ఇది సర్వజనాళికి సులభం
చేకూటుస్తుంది లాభం
ఇది శాస్త్ర విజ్ఞానం
ఇది మన మేధోజ్ఞానం ॥రింగు॥

16-1-1979

# టెలిగ్రామ్

కట్ట కట్ట కడకట్ట అని మోగుతుంది
పట్టు పట్టు పట్టుమని కబు రందిస్తుంది ||కట్ట||

అత్యవసర వార్తలు
అనంత దూరాన్నుంచి
అందిస్తుంది అమోఘంగా
వివరిస్తుంది విశేషంగా ||కట్ట||

కొందరికి ఆనంద హేల-మరి
కొందరికి ఎనలేని గోల
కొందరికి సంబరాలు-మరి
కొందరికి కంగారులు ||కట్ట||

మంచీ చెడులకు తోడు నీడా
శుభాశుభాలకు లేదు తేడా
దూరం ఏమీ లేదు ఎడాపెడా
కాలం అసలే లేదు చెడామడా ||కట్ట||

17-1-1979

# కొవ్వొత్తి

కొవ్వొత్తిని నేను-ఒళ్ళు కొవ్వుబట్టని
కొవ్వొత్తిని నేను ||కొవ్వొత్తిని||

విరజిమ్ముతాను విజ్ఞానపు వెలుగులు
పారద్రోలుతాను అజ్ఞానపు చీకటులు
చిన్ని వెన్నెల సన్మెరాలు
మానవ ముఖారవిందాలు ||కొవ్వొత్తిని||

చేదోడు వాదోడు నా ధ్యేయం
చెలిమి బలిమి చూపడం న్యాయం
ఆనంద మందిరాలు
మనుజ హృదంతరాలు ||కొవ్వొత్తిని||

ఎవ్వరినీ యాచించను
దేనికీ తలవంచను
నన్ను నేను దహించుకొంటాను
నన్ను కరిగింప జేసుకొంటాను ||కొవ్వొత్తిని||

20-1-1979

# టెలిగ్రాం

కట్ట కట్ట కటకట్ట అని మోగుతుంది
పట్టు పట్టు పట్టుమని కబు రందిస్తుంది ||కట్ట||

అత్యవసర వార్తలు
అనంత దూరాన్నుంచి
అందిస్తుంది అమోఘంగా
వివరిస్తుంది విశేషంగా ||కట్ట||

కొందరికి ఆనందహేల-మరి
కొందరికి ఎనలేని గోల
కొందరికి సంబరాలు-మరి
కొందరికి కంగారులు ||కట్ట||

మంచిచెడులకు తోడు-నీడా
శుభాశుభాలకు లేదు తేడా
దూరం ఏమీ లేదు ఎడాపెడా
కాలం అనేది లేదు చెడామడా ||కట్ట||

[illegible]7 – 19[illegible]

# కొవ్వొత్తి

కొవ్వొత్తిని నేను-ఒళ్లు కొవ్వుబట్టని
కొవ్వొత్తిని నేను ॥కొవ్వొత్తిని॥

విరజిమ్ముతాను విజ్ఞానపు వెలుగులు
పారదోలుతాను అజ్ఞానపు చీకటులు
చిన్ని వెన్నెల సన్మేరాలు
మానవ ముఖారవిందాలు ॥కొవ్వొత్తిని॥

చేదోడు వాదోడు నా ధ్యేయం
చెలిమి బలిమి చూపడం న్యాయం
ఆనంద తుందిలాలు
మనుజ హృదంతరాలు ॥కొవ్వొత్తిని॥

ఎవ్వరినీ యాచించను
దేనికీ పలవించను

నన్ను నేను దహించుకొంటాను
నన్నుపకరింప జేసు కొంటాను ॥కొవ్వొత్తిని॥

20-1-1979

# మనస్సు లలితం

మనస్సు లలితం
దేహం కఠినం ॥మనస్సు॥

పరుల బాధల గాంచిన
కరుణ రసార్ద్ర మవుతుంది
కన్నీటి ముత్యాలు రాలుస్తుంది
ముద్దుముద్దుగా మురిపిస్తుంది ॥మనస్సు॥

కర్కశుల గాంచిన
వజ్ర కాఠిన్యం అవుతుంది
వంకర లొత్తుతుంది
బలాన్ని చూపుతుంది ॥మనస్సు॥

కూటికి లేనప్పుడు
కూలినాలికి సిద్ధం
కలిమి గలప్పుడు
కులకడానికి సిద్ధం ॥మనస్సు॥

21-1-1979

# కష్టజీవి ప్రతిజ్ఞ

కష్ట జీవులం—కాయ
కష్ట జీవులం ||కష్ట||

కంఠహారాలు కరిగిస్తాం
బంహారాలు పగలేస్తాం
రత్నాలు రాగదీస్తాం
ముత్యాల ముగ్గులేస్తాం ||కష్ట||

ఉన్నా లేకున్నా ఒకటే
తిన్నా తినకున్నా ఒకటే
ఎండా వానా ఒకటే
వెలుగు చీకటి ఒకటే ||కష్ట||

సంతృప్తి పడతాం సమయానుకూలంగా
సర్దుకుంటాం సాధించిన రీతిగా
సంతోష పడతాం సందర్భోచితంగా
సానుకూలం చేసుకుంటాం సమయోచితంగా ||కష్ట||

24-1-1979

# మనస్సు : లలితం

మనస్సు లలితం

దేహం కఠినం ॥మనస్సు॥

పరుల బాధల గాంచిన

కరుణ రసార్ద్ర మవుతుంది

కన్నీటి ముత్యాలు రాలుస్తుంది

ముద్దుముద్దుగా మురిపిస్తుంది ॥మనస్సు॥

కర్కశుల గాంచిన

వజ్ర కాఠిన్యం అవుతుంది

వంకర లొత్తుతుంది

బలాన్ని చూపుతుంది ॥మనస్సు॥

కూటికి లేనప్పుడు

కూలినాలికి సిద్ధం

కలిమి గలప్పుడు

కులుకడానికి సిద్ధం ॥మనస్సు॥

21-1-1979

# కష్టజీవులం

కష్ట జీవులం—కాయ
కష్ట జీవులం ||కష్ట||

కండశాలు కరిగిస్తాం
బండశాలు పగలేస్తాం
రత్నాలు రాగదీస్తాం
ముత్యాల ముగ్గులేస్తాం ||కష్ట||

ఉన్నా లేకున్నా ఒకటే
తిన్నా తినకున్నా ఒకటే
ఎండా వానా ఒకటే
వెలుగు చీకటి ఒకటే ||కష్ట||

సంతృప్తి పడతాం సమయానుకూలంగా
సర్దుకుంటాం సాధించిన రీతిగా
సంతోష పడతాం సందర్భోచితంగా
సానుకూలం చేసుకుంటాం సమయోచితంగా ||కష్ట||

**24-1-1979**

# విమానం

దవ్వుగ ఆకాశంలో
రివ్వున దూసుక పోతుంది ॥దవ్వుగ॥

పక్షిలాగ దాని ఆకారం
కుక్షిలోన జన సందోహం
నిక్షేపంగా ఉంటుంది
లక్షణంగా వెళుతుంది ॥దవ్వుగ॥

రెండు రెక్కలు చక్కగా ఇరుపక్కల
గిర్రున తిరిగే ప్రొపెల్లర్ ముంగల
తుర్రుమనే పిట్టలాంటి తోక వెనకల
అందాల సుందరమందిరం లోపల ॥దవ్వుగ॥

అనుకొన్న చోటికి అట్టే పోగలం
కావాలన్న చోటికి ఇట్టే రాగలం
దూరం దూరమై పోయింది
కాలం మన దరికి వచ్చింది ॥దవ్వుగ॥

**25-1-1979**

# శ్రామికులం

శ్రామికులం—పాట

శ్రామికులం ॥శ్రామికులం॥

పారిశ్రామిక పథం

దేశానికో ఆయుధం

వేగ పురోగమన విధం ॥శ్రామికులం॥

కష్టించి పనిచేయడం మా విధి

అధికోత్పత్తి మా పెన్నిధి

అది మానవ జాతికి మహానిధి ॥శ్రామికులం॥

పరిశ్రమలు చూపుతాయి మన ప్రగతి

ఆర్థికంగా సాధించాలి పురోగతి

మార్చుకోవాలి మరెంతో మనగతి ॥శ్రామికులం॥

26-1-1979

# జయమ్ము నీకు తెలుగుతల్లీ

జయమ్ము నీకు తెలుగుతల్లీ ! వి ||వి||
జయమ్ము నీకు వెలుగుల తల్లీ ||జయమ్ము||

పెన్న, తుంగ, కృష్ణ, గోదావరి నదులు
మిన్నగ సిరులొసగే తెలుగు పెన్నిధులు ||జయమ్ము||

కవితిక్కన, యోగివేమన, గురజాడలు
తెలుగు జాతిని నడిపించే అడుగుజాడలు ||జయమ్ము||

అమరావతి, నాగార్జునకొండ, రామప్ప, లేపాక్షిశిల్పాలు
అమందానంద కందమైన తెలుగు కళాశిల్పాలు |జయమ్ము||

కృష్ణరాయ, కాటమరాయల కీర్తి కటాక్షులు
ధీభుజశక్తులతో వెలిగించాయి దిగ్దిగంతాలు ||జయమ్ము||

రుద్రమ్మ రాజనీతి, మల్లమ మాంచాలల పతిభక్తులు
బ్రహ్మన్న సమత, పొట్టి శ్రీరాముల ఆత్మార్పణలు
||జయమ్ము||

ఆ మహాశక్తి యుక్తులు నీలో వెలుగ వలయు తెలుగుబాల
అందచందాలు ఆనంద మొలయవలయు తెలుగునేల
||జయమ్ము||

27-1-1979

# రైలు

కూకుహూమంటూ కూతేస్తుంది
చుక్ చుక్ మంటూ కదలుతుంది ||కూ కుహూ||

ఎరుపు పచ్చ రంగుల సంకేతం
చెక్ బుక్ చెక్ బుక్ సంగీతం
బొగ్గూ నీళ్లూ దాని ఆహారం
ఇంజన్‌లోని ఆవిరి ఊపిరి ||కూ కుహూ||

ఎర్రజెండా ఎత్తితే ఆగుతుంది
సంకేతపు గుండిస్తాడు మాస్టర్
గమనించి విషలిస్తాడు గార్డు
పచ్చజండా ఎత్తితే కదులుతుంది ||కూ కుహూ||

రకరకాల వ్యక్తుల్ని చేరుస్తుంది గమ్యం
చిన్న పెద్ద, దొంగాదొర, ప్రేమికులు లేదు తారతమ్యం
ఒకనాడు దొరలకు మాత్రమే పరిమిత రమ్యం
ఈనాడు సర్వజనతా గమన కామ్యం ||కూ కుహూ||

# విద్య విలసిల్లాలి

తొలగాలి తొలగాలి అజ్ఞానపు చీకటులు
వెలగాలి వెలగాలి విజ్ఞానంపు జ్యోతులు ॥తొలగాలి॥

ఒకనాడు గుళ్లు లేనివి లేవు ఊళ్లు
అలనాడు బళ్లుగా వెలశాయి గుళ్లు
ఈనాడు గుళ్లుకాదు కావాలి బళ్లు
చక్కటి గురు శిష్యబంధం వెలిసే బళ్లు ॥తొలగాలి॥

నిరక్షరాస్యతా నిర్మూలనం
కోసం నిర్బంధ విద్యావిధానం
దానితో వయోజన విద్యా విధానం
తెలుగు జాతి ఖ్యాతి వెలిగే విధానం ॥తొలగాలి॥

లింగ వయో భేదం లేక
జాతి మత వివక్ష లేక
కలమి లేమి వర్గ భేదం లేక
విద్య విలసిల్లాలి ఎదురు లేక ॥తొలగాలి॥

29-1-1979

# వందనం పాఠశాలామ తల్లీ

వందనం పాఠశాలామ తల్లీ_శత
వందనం మా తేట తెలుగుతల్లీ ॥వందనం॥

విజ్ఞానపు నిధి తెలుగు పాఠశాల
సాటిలేని తెలివితేటల తెలుగుబాల
సిరిసంపద కళల కాణాచి తెలుగునేల
తిరుగులేక తరుగులేక వెలుగునేల ॥వందనం॥

రాముడు రహీము క్రీస్తులు
జాతిమత రహితులైన దోస్తులు
కావాలి బాలలందరు నేస్తులు
పురోగమించాలి దేశస్థులు ॥వందనం॥

ధీ భుజశక్తులు వెలయించిన జాతి
కలము కత్తి కళాకలనలు వెలిగించిన జాతి
త్యాగ భోగాలు సిద్ధింపజేసిన తెలుగు జాతి
అందరికీ ఆదర్శప్రాయమై వెలుగు జాతి ॥వందనం॥

30–1–1979

# గడియారం

టికు టికు టికు టికు మని వినిపిస్తుంది శబ్దం
టక్కున ఆగిందంటే అంతా నిశ్శబ్దం ||టికుటికు||

ఎరుగుదురా మీరు దీని తమాషా
మొహంలో పొట్టి పొడుగు రెండుచేతులు
పొట్టేమో గంటలు పొడుగు నిముషాలు ||టికుటికు||

ఎరుగుదురా మీరు దీని తమాషా
అరవై సెకండ్లు ఒక నిముషం
అరవై నిముషాలు ఒక గంట ||టికుటికు||

ఇరవైనాలుగు గంటలు ఒక దినం
ముప్పైదినాలు ఒక మాసం
పన్నెండు మాసాలు ఒక వత్సరం ||టికుటికు||

కాల గమనాన్ని మనకు తెలుపుతుంది
కనువిప్పును మనకు కలిగిస్తుంది
కార్యోన్ముఖుల్లో మనల్ని నిమగ్నుల్ని చేస్తుంది ||టికుటికు||

కాలం అంతం చూపుతానంటుంది — కానీ
కాలం అనంతం, ఆగదంటుంది
కాలం వ్యర్థం చేయవద్దంటుంది ||టికుటికు||

31-1-1979

# విద్యుత్తు

మీట నొక్కితే చాలు వెన్నెల
కటిక చీకటి పటాపంచలు
అంతటా వెలుగు వెల్లుగులు
అంతటా పట్టపగలు ॥మీట॥

సహజ జలపాతం వల్లగానీ
నదికి ఆనకట్ట కట్టిగానీ
ఉత్పత్తి చేస్తాకే శక్తి
దీని పేరే విద్యుత్ శక్తి ॥మీట॥

మీట నొక్కితే చాలు
ఫాన్‌కి ప్రాణం వస్తుంది
మండు వేసవి హాయినిస్తుంది ॥మీట॥

మీట నొక్కిన చాలు ఆకాశవాణి
మాటాపాటలు కతాకవితలు వినిపిస్తుంది
మనకు విజ్ఞాన వినోదాలు కలిగిస్తుంది ॥మీట॥

మీట నొక్కటమే తరువాయి
సినిమా, రైలు, ట్రాములు నడుస్తాయి
చిన్న పెద్ద పరిశ్రమలు పనిచేస్తాయి
దేశ పురోగతికి ఉపకరిస్తాయి ॥మీట॥

ఇది ప్రకృతిపై మానవుడు సాధించిన విజయం
విస్తరిల్లిన విజ్ఞాన ఘన విజయం
మానవాభ్యుదయానికి కావాలి జయం ॥మీట॥

1-2-1979

# ఫాన్

తిరుగుతుంది గిర గిర గిర గిర
ఇస్తుంది గాలి చర చర చర చర ॥తిరుగు॥

కాదిది అల్లరి చిల్లరి గాలి
హాయినిస్తుంది మండే వేసవిని ॥తిరుగు॥

మాయ మవుతాయి చెమట బిందువులు
తొలగి పోతాయి చెమట వాసనలు ॥తిరుగు॥

అపనయింప జేస్తుంది శ్రమని
హాయిగా కలిగిస్తుంది నిద్రని ॥తిరుగు॥

ఎంతటిదో విద్యుత్తు ప్రభావం
వింత కదా మన మేధో జ్ఞానం. ॥తిరుగు॥

2-2-1979

# జనతా బస్సు

జనతా బస్సు—సర్వ
జనతా బస్సు ||జనతా||

ఒకనాడు గుర్రాలు బళ్లు వాహనాలు
ఈనాడు చక్కటి బస్సులు వాహనాలు ||జనతా||

ఒకనాడు పాదాలు తప్ప లేదు వాహనయోగం
ఈనాడు చాలా మందికి కలిగింది వాహనయోగం |జనతా|

ఇందులో ప్రయాణీకు లెవరున్నా కూడా
అందరూ సమానమే గాని లేదు తేడా ||జనతా||

ప్రయణానికి కలిగిన సౌకర్యం
ప్రగతి సాధించిన ఘనకార్యం ||జనతా||

3-2-1979

# అహో అద్భుతం

అహో అద్భుతం మానవపురోగతి
మహాద్భుతం విజ్ఞానపు ప్రగతి ||అహో||

మానవుడు సృజించాడు మారణాయుధాలు
మసికాగలవు నిమిషంలో సమస్తదేశాలు ||అహో||

ఆటం బాంబులు హైడ్రోజన్ బాంబులు
అంత్యంత శక్తి మంతిమైన మిస్సైలులు ||అహో||

విజ్ఞాన శాస్త్రం కూర్చాలి మానవుని మనుగడకు శ్రేయస్సు
వినాశం తొలగి కలుగుతుంది మానవాళికి యశస్సు ||అహో||

తాండవించాలి శాంతి సౌఖ్యాలు జగమంతా
తరగని విరగని అమితానందం విశ్వమంతా ||అహో||

4-2-1979

# కలసి ఆడుదాం

కలసి ఆడుదాం_ఒకరికొకరుగా
వలసి పాడుదాం ||కలసి||

ఉరకలు వేస్తోంది ఉత్సాహం
ఉబలాటం చేస్తోంది ఉల్లాసం ||కలసి||

మనకందరకూ లేదు తేడా
మనమందరమూ జోడుగూడా ||కలసి||

కలిసి సాధిద్దాం సమతా
తలచి పెంచుదాం మమతా ||కలసి||

అంటరానితనాన్ని మంట కలుపుదాం.
అంతటా సమైక్య సమ భావం నలుపుదాం కలసి||

5_2_1979

# సమానమే

సమానమే మనమంతరమూ
సమానమే ॥సమానమే॥

ఒకడుమంచి చొక్కావాడు
ఒకడు చింకి చొక్కావాడు
ఒకడు చక్కటి బెల్‌బాటమ్‌వాడు
ఒకడు డాగుల నిక్కర వాడు ॥సమానమే॥

మంచిగుడ్డల అమ్మాయి
మాలిన దుస్తుల అమ్మాయి
తలదువ్వుకున్న అమ్మాయి
విరబోసుకున్న అమ్మాయి ॥సమానమే॥

మనమంతా అన్నాతమ్ముళ్ళం
మనమంతా అక్కాచెల్లెళ్ళం
మనమంతా అన్నా చెల్లెళ్ళం
మనమంతా అక్కాతమ్ముళ్ళం ॥సమానమే॥

6-2-1979

# సేవా పరులం

సేవాపరులం_పర
సేవానిరతులం ||సేవాపరులం||

కూడు లేక
గూడు లేక
గుడ్డ లేక
మాడే దీనుల ||సేవాపరులం||

తిండి లేక
కంట లేక
అండ లేక
నలిగే హీనుల ||సేవాపరులం||

హాయి లేక
శాంతి లేక
కాంతి లేక
కృశించే జీవుల ||సేవాపరులం||

7-2-1979

# వందనం కళాశాలామతల్లీ

వందనం కళాశాలామతల్లీ
సుందరతరవిద్యా కల్పవల్లీ ||వందనం||

కళాకాంతుల కాణాచి
విద్యా వినయాల విపంచి
సరస సహజీవన సమంచి
త సంచితము జేయుమా మించి ||వందనం||

ఉత్తమ జ్ఞాన సంపన్నులు గురులు
సదాసక్తి పరులు శిష్యవరులు
ఉభయ తారకము కాగావరలు
సీపగు విజ్ఞానంపు సిరులు ||వందనం||

ఓరిమి కూరిమినొసగు మామమతా
నెమ్మదిని దయసేయుమా సమతా
చేకూర్చుమా మాలో సఖ్యతా
తనంత తా వెలము మాలో ఐక్యతా. ||వందనం||

8-2-1979

# సినిమా

చలన చిత్రం దీని పేరు
రకరకాల వ్యక్తులు
రంగు రంగుల బొమ్మలు
అచ్చమైన జీవితం
స్వేచ్ఛగా వర్ణితం ||చలనచిత్రం||

ఒకనాడిది మూకీ
ఈ నాడిది టాకీ
నిరుపేదకు విలాసం
నిముషంలో దరహాసం ||చలనచిత్రం||

ఆనందాన్నిస్తుంది
ఆలోచింప జేస్తుంది
వినోద మిస్తుంది
విజ్ఞానం కలిగిస్తుంది ||చలనచిత్రం||

పెద్దలకు పిన్నలకు
చదువుగల, లేనివారికి
ఆడామగా తేడా లేక
అందిస్తుంది ఆనందం ||చలనచిత్రం||

**9-2-1979**

# జేజేలు మా పాఠశాల

జేజేలు మాపాఠశాలా
జేజేలు విద్యావిశాలా ॥జేజేలు॥

విద్యా వినయమ్ములు
బుద్ధి జ్ఞానమ్ములు
శుద్ధి వివేకమ్ములు
ఒసగుమా సద్గుణమ్ములు ॥జేజేలు॥

మమతా మమకారం
సమతా సహకారం
సఖ్యం సద్భావం
దయసేయుమా వరం ॥జేజేలు॥

శాంతి సౌఖ్యాలు
దయా దాక్షిణ్యాలు
ధర్మ న్యాయాలు
ఇమ్మా వేవేలు ॥జేజేలు॥

10–2–1979

# వందనమమ్మా పాఠశాలా

వందన మమ్మా పాఠశాలా
సుందరమమ్మా నీదులీల ॥వందన॥

చదువు సందెలు
తెలివి తేటలు
వెలయు నిమ్మా ॥వందన॥

ఉత్సాహము ఊగా
ఉల్లాసము తూగా
ఆనంద మిమ్మా ॥వందన॥

మంచి అనే చెట్టును
మమత అనే నీరోసి
పెంచగా శక్తి నిమ్మా ॥వందన॥

కలసిమెలసి అందరమూ
కలతలేక పాడి ఆడగా
దయ సేయుమా సదా ॥వందన॥

11–2–1979

# అంతరిక్ష యానం

అంతరిక్షయానం - అనంతమైన
అంతరిక్ష యానం ||అంతరిక్ష||

పూర్వం ఉండేవి పుష్పక విమానాదులు
అని వాకొంటున్నాయి మనపురాణాదులు
కలలాంటి దీన్ని నిక్కువ
మొనరించాయి స్పుత్నిక్కులు ||అంతరిక్ష||

రోదసిలో ప్రయాణిస్తుంది వ్యోమనౌక
తిరుగుతుంది భూమి చుట్టూ తిరుగులేక
ఏగ్రహాన్నైనా సమీపించగలదు
వాతావరణ రీతి తెలుపగలదు ||అంతరిక్ష||

చంద్రుని ఉపరితలం పై దిగింది వ్యోమనౌక
చంద్రునిపై కాలిడి మనుజుడు నాటాడు పతాక
ఇది విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి ప్రతీక
ఇది మానవ మేధో జ్ఞానానికి జయపతాక ||అంతరిక్ష||

21-2-1979

# పరుల కోసమే

కన్నారా మీరెప్పుడైనా
కళ్లారా తేనె టీగను ||కన్నారా||

రంగురంగుల పూవులు
రకరకాల పూవులు
పైనివాలుతుంది మోదాన
పీలుస్తుంది మకరందాన్ని ||కన్నారా||

భద్రపరుస్తుంది తేనె తెట్టెలో
పరుల కందిస్తుంది తేనెపట్టులో
పరుల కోసమే మన శరీరమన్న నీతి
తెలుపుతుంది మనకందరికీ ఈరీతి ||కన్నారా||

18-4-79

# చిట్టి చీమ

చూశారా చిట్టి చీమను
చుట్టూతా తిరిగే చీమను ।చూశారా।

తీరిక లేదు సుంత
నిలకడ లేదు ఇంత
తిరుగుతూ ఉంటుంది వింత
శ్రమించడమే దాని చింత ।చూశారా।

వెళ్లదు ఎప్పుడూ ఒక్కటి
వెళతాయి ఒక వెంబడి ఒకటి
సంఘీ భావము నేర్పుతుంది చీమ
చక్కగాను నేర్వాలి మనం ఎంతో శ్రేయ ।చూశారా।

19-4-1979

# తాతక్కు దగ్గులు

తాతయ్యా మరి వింటావా
తమాషా కథ చెబుతాగా ॥తాతయ్యా॥

నీవేనా ఎప్పుడూ
నే చెబుతాగా ఇప్పుడు
అక్కర్లేదు చప్పుడు ॥తాతయ్యా॥

గంపకింద పిల్లి ఏమిటి తాతయ్యా అంటే
అప్పగించావు పాఠం ఆచారం అంటూ
తద్దినానికి గంపకింద పిల్లికీ ఏమిసంబంధం
చేసేపనికీ ఈ కారణానికి ఏమి అనుబంధం ॥తాతయ్యా॥

ఎద్దులాగ లాగుతున్నాడు వాడు రిక్షా
మొద్దులాంటి వాడి కేమిటి శిక్షా
మనిషికీ మనిషికీ మధ్య ఎందుకీ కక్షా
ఈ యాంత్రిక యుగంలో కల్పించాలి రక్షా ॥తాతయ్యా॥

**20–4–1979**

# మన కోసమే

మనకోసమే — ఇదంతా
మన అందరికోసమే ॥మనకోసమే॥

గాలివీస్తూంది అన్నిచోట్లా సమంగా
చందమామ ఇస్తుంది వెన్నెల చల్లగా
అనుభవిద్దాం మనమంతా ॥మనకోసమే॥

చిలుక పలుకుతూంది మధుర మంజులంగా
కోయిల పాడుతూంది పంచమ స్వరంలో
ఆనందిద్దాం మనమంతా ॥మనకోసమే॥

జీవులకన్నిటికీ సమానమే జననం
ప్రాణులకన్నిటికీ సమానమే మరణం
కలసి జీవిద్దాం మనమంతా ॥మనకోసమే॥

21–4–1979

# ఆరోగ్యమే మహాభాగ్యం

కావాలి జాగ్రత్త – మునుముందే
పడాలి జాగ్రత్త ||కావాలి||



మన ఆరోగ్యం
మహా భాగ్యం
మంచి ఆరోగ్యంలేదు ?
మహాభాగ్యం కోరగాదు ||కావాలి||

ఈనాటి బాలలు
రేపటి పౌరులు
బాలల ఆరోగ్యం
దేశపు సౌభాగ్యం ||కావాలి||

కాపాడాలి బాలల ఆరోగ్యం
రక్షించాలి దేశ సౌభాగ్యం
ఇవ్వాలి పౌష్టికాహార పదార్థాలు
ఒసగాలి చక్కటి ఔషధాలు ||కావాలి||

22-4-1979



డాక్టర్ ఎస్. గంగప్ప

# BALA GEYALU

Price Rs. 5-00

## ఇతర రచనలు

అచ్చయినవి :

కోలాచలం శ్రీనివాసరావు - నాటక సాహిత్య సమాలోచనము
(పిహెచ్. డి. పట్టం పొందిన సిద్ధాంత గ్రంథం)
క్షేత్రయ్య పద సాహిత్యం (ఆం. ప్ర. సాహిత్య అకాడమీ
బహుమతి పొందిన గ్రంథం)
సారంగపాణి పదసాహిత్యం(తి.తి.దేవస్థానం ఆర్థిక సాహాయ్యంతో ప్రచురితం)
కోలాచలం శ్రీనివాసరావు (ఆం. ప్ర. సంగీత నాటక అకాడమీ ప్రచురణ)
ప్రసంగ సాహితి (రేడియో ప్రసంగ వ్యాసాలు-తెలుగునాడు ప్రచురణలు)
తెలుగుదేశపు జానపదగీతాలు (ఆం. ప్ర. సమాచార,
పౌరసంబంధశాఖ ప్రచురణ)
క్షేత్రయ్య (ఆం. ప్ర. సమాచార, పౌరసంబంధశాఖ ప్రచురణ)
సుహాసినీ హాసం (సాంఘిక నవల)
కమర్షియల్ ప్రాక్టీసు, సెక్రెటేరియల్ కోర్సు, భాగాలు I, II
(ఇంటర్మీడియట్ పాఠ్య పుస్తకం, తెలుగు అకాడమీ ప్రచురణ)
సాహిత్యోపన్యాసములు 17 (ఉన్నవ లక్ష్మీనారాయణ శతజయంతి
ప్రసంగం-ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురణ)
నవోదయం (కవితా సంపుటి)

ముద్రణలో :

సాహిత్యసుధ (వ్యాస సంపుటి)
జానపదగేయాలు (జయంతి పబ్లికేషన్స్, విజయవాడ)
నాగార్జునుడు (కన్నడ భాష నుంచి అనువాదం-తి. తి. దేవస్థానం ప్రచురణ)
పురందరదాసు (తి. తి. దేవస్థానం ప్రచురణ)

ముద్రణకు సిద్ధం :

జానపద సాహిత్యసుధ, నాటక సాహిత్య సుధ